# గోలకొండపత్రిక

స్వభాను సం॥ర భాద్రపద బ॥ 3 గురువారము


## పాలకరువు

హిందువులకు గోవు మాతగా దేవతగా పేర్పడినది. పంచగవ్యమును సేవించినవారికే దానిమహిమ తెలియును. గోహింస హిందువులకు సరిపడనే సరిపడదు. ఇట్లున్నా ఎంతమంది హిందువులు ఆవులను పెంచుచున్నారు. హిందువులే కదా పొలాలలో విశేషము గొడ్డుకష్టం చేసేవారు. వ్యవసాయకులు బర్రెలు పెంచినట్లుగా ఆవులను పెంచరు. హిందువు లమ్మినది గోవులు కటికవాండ్లకే లభించెను. ఈ యుద్ధకాలములో పూర్వముకంటె మూడునాల్గంతలు ఎక్కువగా ఆవులు ఎద్దులు దూడలు ఆహారానికై బలియగుచున్నవటకదా! ఆవులను పెంచుట మొదలేతక్కువ. అందులో ఈ పని. కరువులో అధికమాసం వచ్చినది. యూరోపుజాతివారు గోసంగులు అనగా గోహింసకులు మనము ఆవులకాళ్ళకు మొక్కి గోమూత్రమును తీర్థముగా సేవించినను ఎక్కువ పాడిని ఉత్పత్తి చేయలేదు ఆ గోభక్షకులు ఆవులను ఎద్దులను సాపాటుచేసినను మనకంటే ఎక్కువ వాటిని ఉత్పత్తి చేయుచు వచ్చినారు కేవలోత్పత్తియే కాదు. వారు సమృద్ధిగా పాడిని అనుభవించటయే కాదు. వారికెక్కువై గొల్లభామగురుతుగడ్డపాలుఅనీ, హార్లిక్సు పాలపొడిఅనీ, గ్లాక్సోడబ్బాపొడిఅనీ, కండెన్సుఅయిన (గడ్డగాచేసిన) పాలుఅనీ, చీజ్ (ఒక విధమగు జున్ను) అనీ, ఎన్నెన్నో పేరులుపెట్టి ఆపాలను ఖోవాలచేసి మన దేశానికి (గోపూజకులదేశానికి) ఏటేట కోట్లకొలది విలువచేయు పాలపాడిని పంపుచున్నారుకదా! ఇంతకంటే లజ్జాకరమగు విషయముకలదా? మనమే యితరదేశాల కట్టివిధముగా ఎగుమతి చేయవలసియుండెను. అందుచేతనే మనము ఆత్మనువదలి కళేబరమును పట్టుకొని సాధించువారమైపోయినాము

పాలవలనిలాభాలు అనంతముగాడన్నవని ఎందరు గ్రహించినారు? ఆవిషయాల గ్రహించియుంటే ప్రతి వ్యవసాయకుడును ఆవులను పెంచియుండును. బర్రెపాలు మంచివికావు. బుద్ధిమాంద్యము కలిగించును. బర్రె మురికి జంతువు. ఆవుపరిశుభ్రతగలది దాని దూడలు సేద్యమున కనుకూలించును. దున్నపోతులుఎద్దులలో దశాంశము కూడా సేద్యానికి పనికివచ్చునవికావు. ఆవుపాలు పథ్యమునకు పనికివచ్చును. బర్రెపాలు డాక్టర్లుకూడా పసంసచేయరు. పాలను పుష్కలముగా పిల్లలకు త్రాపితే వారిమెదడులు బాగావృద్ధి పొందును. శరీరముబాగా పెరుగను. సమృద్ధిగా పాలుత్రాగినబాలురు ౧౬ ఏండ్ల లేక ౨౦ ఏండ్లవయస్సు వరకే బాగాయెత్తుగా దిట్టముగా పెరుగుదురు. నగరాలలో నీళ్లకుకూడా విలువ కలదు. మునిసిపాలిటీవారు నీటిపన్ను వసూలుచేయుదురు. అదిచాలదని పాలవారుకూడా నీటిని అమ్ముచున్నారు. ఒకసేరుపాలలో ఒకసేరు నీరుకలుపుదురు మరీ దుర్మార్గులైనవారు రెండుపాళ్ళనీరు ఒకపాలు పాలుకలిపి అమ్ముతారు. ఈవిధముగా నీటికి విలువకలిగినది. నగరాలవారికి మంచిపాలు మంచి నెయ్యి దొరకుట అంటే అమృతందొరకినట్లే. కల్తీనెయ్యిచేసే కిటుకులు ఇప్పుడు పల్లెటూరువారుకూడా నేర్చుకొన్నారు. దానినే పట్టణాలలో తెచ్చి అమ్ముతారు. పాలనుండివచ్చు నవనీతమెంతటి ఆనందదాయకమో దానిననుభవించిన కృష్ణునికెరుక సంపన్నుల పిల్లలకెరుక. ఆనవనీతమునుండి సద్యోఘృత మెంతటి యుత్తమమైనదో పల్లెటూరి సంపన్న వ్యవసాయకులకే యెరుక. బ్రాహ్మణులు నెయ్యిఅంటే చెవులుకోసుకుంటారు- వారికి పూర్వం నాస్తికులుండేవారని రామాయణము తెలుపుచున్నది. ఆ నాస్తికులుకూడా

యావజ్జీవేత్ సుఖంజీవేత్
ఋణంకృత్వా ఘృతంపిబేత్

అని అన్నారు. ఇంగ్లీషువారికి నెయ్యి రుచి తెలియదు. అందుచేత వారి భాషలోనికిమనఘృత తద్భవముగు "ఘీ" పదమును తీసికొన్నారు.

హిందువులలో బ్రాహ్మణులు వైశ్యులు మాంసాహారమును కొన్ని శతాబ్దములనుండి వదలుకొనిరి. దానికి ప్రత్యామ్నాయముగా మినుములు, నెయ్యి, పాలు ఏర్పాటు చేసికొనిరి. అట్టివారున్నా ఆవులయొక్కయు పాలయొక్కయు ప్రాముఖ్యమును గ్రహించుటనుమానుకొన్నట్లున్నది. పాలకుమారుగా విషప్రాయమైన "చా" కాఫీ, చోష్యమాన మగుచున్నది. ఈ పేషజ్ పల్లెపల్లెకు ప్రాకినది. ఇక పాలనెవరడుగుతారు.

గతమాసము మాడరన్ రెవ్యూలో పాలనుగూర్చి కొన్నిఅంకెలు తెలిపినారు. వాటినుండి కొన్నియిందు గ్రహించుచున్నాము. కలకత్తాలోఇప్పుడు రూపాయికి రెండు సేర్లు మరీమాట్లాడితే ఒకటిముప్పావుసేరు పాలు అమ్ముచున్నారు. మనదేశములోని బెంగాలులో సగటున ప్రతిదినము ప్రతిమనిషీ ఎన్ని పాలుత్రాగుచున్నాడో ఇతరదేశాలలో ఎన్ని త్రాగుచున్నాడో ఈక్రింది విషయమువల్ల స్పష్టమగును.

బెంగాలులో ౬ ఔన్సులు
ఇంగ్లండులో ౪౦ ,,
ఆస్ట్రేలియాలో ౪౫ ,,

ప్రతిపాడిపశువు సగటున మొత్తము హిందూస్థానములో ఏడాదికి ౩౦ గ్యాలనుల పాలిచ్చును కాని డెన్మార్కులో అట్టిపసరమే ౩౨౫ గ్యాలనులిచ్చును. స్విస్సుదేశములో ౩౫౦ గ్యాలనులిచ్చును. "మన ఇండియా" అను గ్రంధమును మిన్నూమసాని అనునామె వ్రాసెను. దానిని తెనుగులో ప్రకటించిన విషయమును మేము తెలియుంటిమి. దానిని ప్రతి విద్యావంతుడును చదువవలెను. అందు మన భారతదేశములోని పసువులకును ఇతరదేశాల పసువులకును గల తారతమ్యము తెలిపినారు. మనబర్రెలకంటె ఆవులకంట పదంతలెక్కువగా ఇతరదేశాల పాడిపసరము లెందుకుపాలిచ్చుచున్నవో గోదేవతనుపూజించువారు ఆలోచించవలెను. వారు పెంచినరీతిగా మనము పెంచుటలేదు. మనదేశములో పాలకు నెయ్యికి ధరలు చాలాపెరిగినది కొన్నికొన్నితావులలో నాల్గంతలవరకు పెరిగినది. కాని యుద్ధములో కుత్తుకబంటిగా మునిగిన ఇంగ్లండులోధరలు పూర్వము రూపాయిపుం

### శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము

## అష్టావధానము

తేది౧౩-౯-౪౩ శుక్రవారమునాటి సాయంకాలము ౫-౩౦గంటలకు శ్రీమాన్ మసునూరి లక్ష్మీనృసింహాచార్యులుగారిచే అష్టావధానము నిలయభవనమున జరుపబడును కరపత్రములద్వారా తెలుపుకొనజాలని సభ్యులుక్షమించి ఈవిషయమును తమసమీపమునందుండువారికిని తెలియజేసి సమావేశమునకు తోడ్కొని రాప్రార్థితులు.

బి వేం. శేషయ్య

ప్రతిజిల్లాలో ఈసంవత్సరం జంబ్వారీవేలం ఎక్కువైంది ఈదర్జాలు దాకమందు సవాళ్లు అయ్యేను సగటున గతసంవత్సరంపొందుబాట్లపైన నూటకు౫౦ప్రకారంవ్యక్కివది ఈవానలతీర్వాతి అయియుంటే ర ౦౦తలుఅగుచుండేసేవా! చెట్టు పన్ను రెండంతలవరకు పెంచితి పైరకు పన్నులు పెంచరి—౫౫ క్కిడికీన్ని ఈజిగివాను పరియు కల్లు మామూలాచేసేవారు సవాళ్ళు ఒకరిపైఒకరు ఎక్కించుచునేపోయిరి-

* *

ట ఇప్పుడు రూపాయిపావులామాత్రమే- సాధారణమైన మనిషికి ఒకనానికి ౨౬౦౦ క్యాలరీలుకావలెనని డాక్టర్లంటూరు. క్యాలరీలంటే యేమిటో తెనుగు సాంకేతికపదాల నిఘంటుకారులెవ్వరున్నా తెలుపలేదు- వ్యవసాయకష్టం చేసేవారికి ౩౫౦౦ క్యాలరీలు దినానికి కావలెనట. ఇప్పుడు రేషన్ ఏర్పాటగు ప్రాంతాలలో ౧౫౦౦ క్యాలరీలవరకుండు ఆహారపదార్థాలకు సెలవిచ్చుచున్నారట- ప్రతిమనిషికి దినానికి ౬ చటాకుల బియ్యమిస్తే వాటిఅనుపానంతోసహా వాటిలో ౧౫౦౦ క్యాలరీలే యుండునట డిల్లీశాసనసభలోమనిషికి ౮ చటాకుల తిండిదాన్యం ప్రతిమనిషికిస్తే సరిపోతుందని ప్రభుత్వపక్షాన తెలిపిరి కాని ౧౮౮౦నాటికరువు నియమావళి (Famine code)లో ఉప్పరిపనివానికి ప్రతిమనిషికి దినానికి ౧౬ చటాకులును మట్టిమోసేవానికి ౧౨ చటాకులును పిల్లలకు ౮ చటాకులును ఇయ్యవలెననియున్నదికదా! మన దేశములోని జనులెంత? ఆరోగ్యకరముగాలేదనియు పుష్టిగల ఆహారము చాలాతక్కువగా తిందురనియు అందుచేత జనులలోని సత్తువక్షీణించుచున్నదనియు. వైద్యులు చాలాగ్రంథాలు వ్రాస్తున్నారు గ్రంథాలువ్రాస్తే కడుపునిండుతదా? ఇప్పుడు బెంగాలులోమంది కూటికిలేక చస్తున్నారు- ఆజాడ్యంబిహారుకు ప్రాకినది- ఒరిస్సాలోనికిదిగినది మన చుట్టుఆవరించినది. రాయలసీమలో ఒకయేడాదినుండీ కరువున్నది. ఇట్టిపరిస్థితిలోమనజనసామాన్యానికి పుష్టిగల ఆహారంమాట అటుండనీ బ్రతికేహద్దువరకు ఆహారం లభించుటలేదు. ఇప్పుడు ఆవులు కసాయివారి కత్తులకు బలిఅగుచున్నదికదా ఇక ముందుకాలములో సంపన్నులకు కూడా పాలుదొరకవేమో' గోమాతపూజకు కూడాదొరకదేమో" ౧౯౩౧ జనాభాలో మన దేశమందు ప్రతిమనిషి సగటున ప్రతిదినం ౭ ఔన్సులకు పైగా పాలు త్రాగుచుండెననియు ఇప్పుడు ౫ ఔన్సుల చిల్లర పాలే త్రాగుచున్నాడనియు ఇది చాలా భయంకరస్థితియనియు జనాబావారే తెలిపియున్నారు. జనులు జాగ్రత్తపడవలెను- పశుసంపదవిషయమై జనులలో ఏమాత్రమున్నా ఆందోళనలేదు ప్రభుత్వమువారుకూడా తగిన శ్రద్ధవహించవలెను. ప్రభుత్వమున్నూ ప్రజలున్నూ నిజముగు (కాగిదంప్రణాళికలు కాక) కృషిచేయవలసి యుండును.

## హైదరాబాదు స్క్వాడ్రన్

హైద్రాబాదుప్రభుత్వము ఇంగ్లీషువారికిచ్చిన విమానస్క్వాడ్రన్ చాలాఘనకార్యాలు చేసినట్లు తెలియవచ్చినది ఆఫ్రికాలో పనిచేసినది మార్చినెలలో అది బాంబర్ గా మార్చబడెను అట్లుచాలాపనిచేసెను. బాంబులను శత్రువులపై చాలావేసి వారినినష్టపెట్టెను. వాట నడిపేవారిబహుకరీకగాను వారికి ప్రశంసలియ్యబడెను. వాటినినడిపినవారిలో ముఖ్యుడు స్క్వాడ్రన్ గ్లోవర్ అనువాడు. రెండవవాడు కింగ్సుఫోర్డు. వీరుకాక యింకాముగ్గురుకలరు. వీరంతా శత్రువిమానాశ్రయాలధ్వంసము చాలామాతులు చేసిరి

హైద్రాబాదునగరంలో ఇద్దరు పోయినసెలలో రామమందిరంవద్ద గోడలపై చెప్పుకోరానట్టి ఆక్షేపణీయమైనవ్రాతలుకల కాగిదాలు అంటించిరని కోర్టువారు ౧౫దినాలజెయిలుశిక్ష జుర్మానా విధించిరి-

* *

సోమవారమునాడు శ్రీకృ.దే.గ్రంథాలయములో పోతనటాకీలో శ్రీనాథపాత్రధరించిన జంధ్యాల గౌరీనాథశాస్త్రిగారు సంగీతమెట్లుండవలెను. టాకీలలోని అభినయములో లోపములేని తెనుగుటాకీలుఅభివృద్ధికి సెందుకున్నవిలపవిషయాలనుగూర్చి యుపన్యసించిరి.

* *

గ్యాసునూనె కూపనులు హైద్రాబాదునగరంలో ఏర్పాటైనవి తమతమ వార్డులవద్ద దరఖాస్తులిచ్చుకోవలెను. దానికి ప్రత్యేకఫారము ఏర్పాటైనది, దానిపూరించి ౧౦ ఆబానునాటి వరకు యిచ్చుకోవలెను.

* *

నిజాంకళాశాల ప్రిన్సిపాల్ ఖాదరీహుసేనీఖాన్ గారి అకాలమరణమునకు విచారసూచకముగ నవాబ్ మెహదీయార్జంగు బహదర్ గారి అధ్యక్షతలో సభ౧౯వ తేదీ జరుపబడినది. ఉపాధ్యాయవర్గము విద్యార్థినీవిద్యార్థులపక్షమున నీసభ జరుపబడినది. అక్టింగుప్రిన్సిపాల్ డాక్టరు జాహిదలీగారు ప్రిన్సిపల్ ఖాదరీ హుసేను గారి జీవితచరిత్ర, కళాశాలకు వారొనర్చిన అమూల్యసేవనుగూర్చి సంగ్రహముగ తెలిపిరి సభవారి సానుభూతి ప్రిన్సిపాల్ వారి కుటుంబమునకు తెల్పుచు శోకసందేశము పంపుటకుగా చదివిరి రెండు నిమిషములుడరుకు లేచి వారిఆత్మశాంతికై మౌనిక ప్రార్థన సల్పినఅనంతరము నవాబ్ మెహదీయార్జంగు బహదర్ గారు సభముగించిరి, మృతులగౌరవసూచకముగా మరునాడు కళాశాల మూసివేయబడినది.

* *

ఉస్మానియా బి.ఇ. డిగ్రీకలవారు ఇంజనీయరింగ్ సర్వీసు పరీక్షలకు నవంబరునెలలోకూర్చొనవచ్చును.

* *

హైద్రాబాదులో మోటారురిజిస్టరీ ౧౫అబాన్ వండి ౧౫ఆజూరు ౧౩౫౩ఫ॥ వరకు జరుగును

* *

విద్యుత్తు పవర్ మిషనులకుగాను హైద్రాబాదు నగరంలో ఎక్కువగావాడితే ఎక్కువయూనిట్లకు ఎక్కువరేట్లు వసూలుచేయుదురు కాని వారికి తెల్లకువలె కఠిన విధానం ప్రస్తుతం ఉండదు, అయినా వారు మెలకువతో వాడుకోవలెను

* *

నగరములో విద్యుత్తును తక్కువగా వాడుటకుగాను ఈ సూచనలు చేయబడుచున్నవి.

౩౦ క్యాండిల్ పవర్ బల్బుతో

| | | | | |
|---|---|---|---|---|
| ౧ | యూనిట్ | 33 | గంటలుకాలును. | |
| ౫౦ | ,, | ,, | ౨౦ | ,, |
| ౬౦ | ,, | ,, | ౧౬ | ,, |
| ౧౦౦ | ,, | ,, | ౧౦ | ,, |
| పెద్దపంఖా | ,, | ,, | ౫ | ,, |

* *

### బెంగాలుకు సహాయం

గౌ॥ సర్ ఆర్థర్ లోతియన్ హైద్రాబాదురసిడెంటుగారు ఇండియన్ రెడ్డుక్రాసు సొసైటీపక్షాన బెంగాలులోని ప్రేరిభాలురం క్షామబాధానివారణార్థము సికింద్రాబాదు ముర్నగురుసిడెంటు పరిపాలితభాగాల రు ధర్మాలియ్యవలెనని ప్రకటించినారు.

ఢిల్లీనాశ్రవ క్షితిశముగారు అనుమతిమున్నా ఒకవారము ఎందుకుకాని విదేశి మనుష్యులని హైద్రాబాదు ప్రభుత్వమువారు నిర్బంధించివారిని వెళ్ళగొట్టినారు.

* *

మిహక్ సెల ౧౫ దాకా హైద్రాబాదులో ౧౧ ఆబానువరకు కూపనులు కలవారికి పంచిపెట్టబడును

మూలలతిలు పెట్టి ౫౦ పరిశ్రమను కట్టెలు గడ్డి వస్తువులకు సిద్ధముచేసేనట ఆదేయుటో హైద్రాబాదులోని ధనికులు స్థాపింపనున్నారట. దానికి ముఖ్యులు న సాలార్జంగు, బ. గారట.

* *

## సత్యార్థప్రకాశ దినము

హైద్రాబాదు రాష్ట్రములో పలుతావుల శ్రీమహర్షి దయానంద భగవత్పాదులవారు రచించిన సత్యార్థప్రకాశ గ్రంథమునుమార్చిప్రభుత్వమున్నూ దానిపై చేతులువేయకుండురుగాక అని పలువురు ఆర్యసమాజంవారు హిందువులు చాలా సభలు చేసిరి. సత్యార్థప్రకాశము హిందీ.ఉర్దూ. తెనుగు, మరాటీమున్నగు బహుభాషలలో తర్జుమా అయినది. దానిలోఒకప్రకరణములో ఇస్లాం మతఖండనముకలదు. మరొకప్రకరణములో క్రీస్తు మతఖండనముకలదు. ఇతరభాగాలలో హిందువులలోనియనాచారాలు (వాతివృష్టిప్రకారము) ఖండింపబడినవి. అందరురూ ఓర్చుకొన్నారుగాని సింధులో క్రొత్తగారాజ్యపదవినిపొందిన ముస్లింలీగు ప్రభువర్గమువారికి ఓర్చుకొనుటకు వీలులేకపోయినది. సత్యార్థప్రకాశమును సింధులో నిషేధింప ఆలోచించిరి, అంతలో పెద్దగోలయయ్యెను. మర ఆవారు ఊరకొరి. ఇప్పుడుమరలవారు ఢిల్లీ కేంద్ర ప్రభుత్వమువద్ద తమప్రభావం వేయుచున్నారని ఆర్యసమాజమువారువిని దేశమంతట సభలు చేయుచున్నారు. హైద్రాబాదులో గతగురువారం సభజరిగెను. వినాయకరావుగారు అధ్యక్షత వహించిరి నరేంద్రజీమున్నగువారు ఉపన్యసించిరి. ఉపన్యాసాలసారాంశమేమనగా ఎవరైనాసరే సత్యార్థప్రకాశమును నిషేధించిరా ఆర్యులు ఓర్వ కోరు దానిలోఒక్కవాక్యాన్ని ఒక్కఅక్షరాన్ని తీసివేయనీయరు అందరికనుండే మతస్వాతంత్ర్యం ఆర్యులకుండవలెను. పూర్వముపలుమారులు దీనిపై చేయివేసుకొనుటకు పలుప్రభుత్వాలు ప్రయత్నించినవి. వీలుకాలేదు, ౧౯౦౭లో ఇండియా ప్రభుత్వం ఆదేశాలలో పనచేసెను, గడబిడయయ్యెను. ఆ గడబిడతో చిటికెలమీద ౨౦,౦౦౦ సత్యార్థప్రకాశగ్రంథము లమ్ముడుపోయెను. దానికేమైనా అపకారమైతే ఆర్యసమాజంవారు ప్రాణాలర్పించుకోగలరు,

ఉపన్యాసాల అనంతరం ౧౦౦ ప్రతులు అమ్ముడుపోయెను-

* *

బెంగాలు క్షామబాధితులకు సహాయార్థము హైద్రాబాదు సికింద్రాబాదు గుజరాతీలు ౨౦ వేలు ఎం నాలిచ్చినారు.

* *

నిజాంకాలేజి ప్రిన్సిపాల్ గామునీన ఖాదిరు హుసేన్ ఖాన్ గారు రోగముతో కూరూలో చనిపోయెను.

## తెనాలి రామకృష్ణ

ఈచిత్రము రోహిణీపిక్చర్సువారి దేదీప్యమానమైన రెండవచిత్రము. ఈచిత్రము రాయలు సినిమాలో నడచుచున్నది. దీనిలోజగమెరిగిన శ్రీతెనాలి రామకృష్ణుని జీవితములోని కొన్ని ఘట్టములను స్పష్టముగా చూపించినవి. ఇదులో మాస్టర్ రాజు రామకృష్ణుని పాత్రను పోషించినారు వీరు ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించెదరు వీరి నటనాచాతుర్యమువలననే చిత్రమునకు ఒకవిధమైన గొప్ప శోభవచ్చినదనవచ్చును.

తెనాలిరామకృష్ణుడు గొప్ప రాజకీయవేత్త సంఘసంస్కర్త మరియు గొప్పకవి. ఈచిత్రములో సంఘములోనియుండు దురాచారములు మరియు వాటిని తెనాలి రామకృష్ణుడు ఏవిధముగా నెమరొక్కునో చూపబడినవి, ప్రతి ఆంధ్రుడు చూడదగిన చిత్రము, రోహిణీ పిక్చర్సువారు దేదీప్యమానమైన చిత్రమును ఆంధ్రులకందించినారని చెప్పవచ్చును.

ఘట్కేసరిలో మహిళా సంఘము స్థాపింపబడినది

అధ్యక్షురాలు-శ్రీమతి నాక్కాని లక్ష్మీబాయిగారు
ప్రధానకార్యదర్శిని ,, ఎ ప్రభరాంబగారు
సహాయకార్యదర్శిని ఎడ్ల కౌసల్యగారు,
మరియు ముగ్గురు సభ్యులు.

### ఉస్మాన్ గంజు గుమాస్తాల హడ్తాల్

ప్రతిఆదివారము బజారువాళ్లు కట్టివేసి గుమాస్తాలకు సెలవు యివ్వవలసినదిగా దుకాణముల యజమానులను కోరుకన్న సందర్భములో ౧౬౨ రోజు తేదీవరకు అంగీకరించిన ఒకరుకాణములతోను మిగతా దుకాణములకొరకు గుమాస్తాలు హడ్తాలు చేయవలసివచ్చిన అందరు యజమానులు అంగీకరించి గత ఆదివారము కొట్లు మూసివేసిరి. యింకా కొన్నిదుకాణములుమాత్రము మూయలేదు

